# అన్వేషణ - అనుభూతి





డా॥ మోపిదేవి కృష్ణస్వామి



ప్రచురణ

ది వరల్డ్ టీచర్ ట్రస్టు సోదరబృందం

అమలాపురం

# అన్వేషణ - అనుభూతి





డా॥ మోపిదేవి కృష్ణస్వామి



ప్రచురణ

ది వరల్డ్ టీచర్ ట్రస్టు సోదరబృందం

అమలాపురం

ప్రథమ ముద్రణ
మార్చి 1982


ప్రతులకు :
పబ్లికేషన్స్ డైరెక్టరు
ది వరల్డ్ టీచర్ ట్రస్ట్
'రాధామాధవం'
14-38-2
ముప్పిడి కాలనీ
విశాఖపట్నం



వెల : రు. 3/-



ముద్రణ :
'ముముక్షువు'
పవరుపేట
ఏలూరు

# పరిచయము

విద్యార్థిలోకానికి గల ఏకైక పరిష్కారమే యీచిన్న పుస్తకం. సమాజంలోని విపరీత భావావేశములకు గురియై తుఫాను గాలిలో విలవిలలాడే లతలవలె సాగుతున్నాయి నేటి విద్యార్థి జీవితాలు. దిక్కు తెలియని పరిస్థితులలో వారుంటే, రాజకీయ, మతప్రయోజనాలకు, దేశవిద్రోహకచర్యలకు వీరిని నిర్దాక్షిణ్యంగా వాడుకుంటున్నాయి కొన్ని స్వార్థశక్తులు.

భావావేశపు పెనుతుఫానులో కొట్టుకొనిపోతూ ఆరిపోబోయే ఒక జీవితం సంస్కరింపబడి సమాజసేవకు సమర్పణ చేయబడిన ఒక ఉదంతం యీ "అన్వేషణ - అనుభూతి". ఇది ఒక ఆరంభం.

త్రికరణశుద్ధిని బట్టి ప్రతి పిలుపునకు ఒక సమాధానం ప్రకృతిలో ఉందని మరియొక నిరూపణమే ఈ పుస్తకం.

ఇది ఒక స్వీయగాథ. ఇందలి అనుభవములు, అనుభూతులు వ్యక్తిగతములు. కాని ఇందు దాగిన సత్యములు

శాశ్వతములు. చదువరులు సత్యములను గ్రహించి శాశ్వతా నందపు మార్గమున పయనింతురు గాక! స్వానుభవములను నిర్భీతిగా పలికిన సోదరుడు కృష్ణస్వామి.

ఇందలి కథానాయకుడు సోదరుడు కృష్ణస్వామి వెలిగింపబడిన ఒక దీపం. గాలిలోనైనా ఆరకుండునట్లు దివ్య శక్తులు యీ దీపాన్ని ఆశీర్వదించగలవు. దానికి ఆధారం నిర్విరామమైన నిస్స్వార్థమైన సత్కార్యాచరణము. ఆ బాధ్యత మాత్రం కథానాయకుడిదే. కృష్ణస్వామి ముందుజీవితం బాధ్యతానిర్వహణకు సంబంధించిన క్రొత్తపర్వం. దాని రచయిత యతడే.

ఏ దివ్యశక్తి యతనిని సమాజసేవకై ప్రేరేపించిందో, ఆ దివ్యశక్తియే అతనిని సదా నడిపించమని వందనములర్పిస్తూ

సోదరుడు

పార్వతీకుమార్

# కృతజ్ఞతలు

ఏదో ఒక రూపంలో జాతికి కృష్ణస్వామిగారి జీవిత గాథ అందాలనీ, అందితే దానికి తగిన ప్రయోజనం ఉండి తీరుతుందనీ అనుకుంటూవస్తున్నవాళ్ళలో నేనొకణ్ణి. ఇలా అనుకొంటూ ఉండగా 'జీవనజ్యోతి'లో కృష్ణస్వామిగారిని గూర్చి పరిచయమాత్రంగా ఇవ్వబడింది. ఆ వెలువడినభాగం నాలోని ఉత్సుకతను మరింత పెల్లుబక జేసింది. 'ఈయన జీవిత పూర్వాపరాలు మరికొంత వివరంగా తెలియజెప్పే రచన వెలువడితే బాగుంటుంది' అని చాలమందిమి అనుకొంటూ వస్తున్నాం.

మా కోరిక చిత్రంగా ఫలించింది. ప్రత్యేక కార్య క్రమంపై కృష్ణస్వామి అమలాపురం వచ్చారు. కార్యక్రమం పూర్తయి బయల్దేరుదా మనుకొంటుంటే ఆర్టీసీ బస్సుల బంధని తెలిసింది. 'ఏమిటోయ్ మనని దిగ్బంధం చేశారు,

ఇప్పుడు మనచేత ఏం చేయించబోతున్నారు?' అన్నారాయన నన్ను చూసి. 'జరగవలసిన కథ ఎంతో విలువైనదయితే తప్ప మీరిలా ఇరకాటంలో పెట్టబడరుగదా!' అన్నాన్నేను. అంతే. కూర్చున్నాం. 'మీరు ప్రారంభిస్తున్న ప్రచురణ విభాగానికి సరిక్రొత్త పుస్తకం ఇవ్వనా?' అంటూ డిక్టేట్ చెయ్యడం మొదలుపెట్టారు. రచన పూర్తయింది. దానికి 'అన్వేషణ - అనుభూతి' అని పేరుపెట్టి, దీనితో ముందుకు సాగండి అని ఆశీర్వదించారు. అంతలో బస్సులు సాగుతున్నాయన్న వార్త వచ్చింది. ఆయన ముందుకు సాగి వెళ్ళిపోయారు. అలా నడిచివచ్చి నేటి యువతను నడిపించగల స్వీయగాథను అందించిన శ్రీ కృష్ణస్వామిగారికి మా కైమోడ్పులు.

చిత్రకారుడు కుంచెతో ఏమేమో వ్రాస్తూ ఉంటాడు. అతడు ఏది ఎందుకు వ్రాస్తున్నాడో అతనికి తప్ప చూసే వారికేకాదు, తయారవుతున్న ఆ చిత్రానికి కూడా తెలియదు పూర్తయ్యేవరకు. మాస్టరు ఇ. కె. శిక్షణావిధానం కూడా అలాంటిదేనని అనుభవంలో తెలుస్తోంది. ఎదురుగుండా ఉన్న పనిని చేస్తూఉన్నట్టు ఆయన కనబడుతున్నా తనతో కలిసి నడుస్తున్నవారిని ఏక్షణంలో ఎలా తీర్చిదిద్దుకోవాలో ఆయనకు బాగా తెలుసు. ఈనాడు అమలాపురంలో ప్రచురణ విభాగం ఏర్పడటానికి, ఇక్కడి సోదరబృందమంతా ఒక్క

టయి ఈ విభాగాన్ని నిర్వహించబూనటానికి ఆయన అను గ్రహమే కారణం. ఈ అనుగ్రహానికి పూజ్యసోదరులు శ్రీ పార్వతీకుమార్ గారి ఆదరణ, సారథ్యం తోడుకావడం మా అదృష్టం. వారికి మా కృతజ్ఞతాభివందనాలు.

ఈ గ్రంథాన్ని సోదరుడుగా విని, పరవశించి వెంటనే ముద్రణ బాధ్యతను స్వీకరించి సకాలంలో అందించిన శ్రీ ముత్తీవి సీతారాం మాకు ప్రచురణ శ్రమగాకాక లీలగా చేశారు. అతనికి మా అభినందనలు.

ముఖచిత్రాన్ని తీర్చిదిద్దిన వర్ధిష్ణువు మహేశ్వరదాస్. ముఖచిత్రం ఇలాఉంటే బాగుంటుందని నిర్ణయించి, దానికి కొద్ది గంటలలో కళాత్మకమైన రూపకల్పన చేశాడు. మరొక చిరంజీవి త్రినాథ్ అక్షరాలను అందంగా వ్రాసి యిచ్చాడు. వారికిరువురికి మా ప్రోత్సాహపూర్వక అభినందనలు.

ఆవిష్కరణోత్సవం ఏర్పాటు గావించిన విజయవాడ సోదరబృందం వారికి కృతజ్ఞతలు.

మాస్టర్ కుటీర్, వాడవల్లి చక్రపాణి
కొంకాపల్లి - అమలాపురం
9-3-1982



# అన్వేషణ - అనుభూతి

నా చిన్నతనాన్ని దివ్యత్వంతో మేళవించిన తన పెంపకంతో తీర్చిదిద్దడానికి ప్రయత్నించింది మా అమ్మ. నేనే పెద్ద కొడుకు నవ్వడంవల్ల నాచుట్టూ ఆవిడ దినచర్య అంతా నడిచేది. ఊహ తెలిసినప్పటినుంచి ఆవిడచేసే దైవస్మరణ వింటూ, పూజలుచూస్తూ ఉండేవాడిని. అవేమిటో తెలీక పోయినా అలా వింటూ చూడాలనిపించేది. మూడవయేటనే ఆవిడే స్వయంగా అక్షరాభ్యాసంచేసి, శ్రద్ధగా విద్య నేర్పడం ప్రారంభించింది. మొదట్లో 'చదువుకో నాన్నా' అంటే నేను ఏడుపుముఖం పెట్టేవాణ్ణట. ఆవిడ రెండుమూడుసార్లు ఆ ముఖాన్ని చూసి, 'నాన్నా, ఏడుస్తున్నావా? ఏడిస్తే సరస్వతీదేవి నీదగ్గరకు రాదు. చదువంటే ఏమిటనుకున్నావ్? దేవత. సరస్వతీదేవి' అని చెప్పిందట.

'చదువంటే దేవతా? అయితే నాక్కనబడుతుందా?' అని అడిగానట నేను.

'తప్పకుండా కనబడుతుంది. నువ్వు శ్రద్ధగా చదువుకొంటే నీకే తెలుస్తుంది. ఆవిడ నీకు కనిపించి తీరుతుంది' అని చెప్పిందట.

అప్పట్నుంచీ మేలుకొన్నంతసేపూ చదవడం మొదలు పెట్టానట నేను. నిద్దట్లో కూడా ఆ పాఠాలే కలవరించేవాణ్ణట.

కలవరింతల్లో ఆ పాఠాలు క్రమం తప్పకుండా ఉంటున్నాయో లేదోనని అప్పుడప్పుడూ మానాన్నగారు నాపుస్తకాలు తీసి చూసేవారట.

కొన్నాళ్ళకి నిద్రలేవంగానే 'అమ్మా! రాత్రంతా సరస్వతీదేవి నాదగ్గరే ఉందమ్మా. నాచేత నీలాగే బోల్డు పాఠాలు చదివించింది' అని ఏమేమి పాఠాలు చదివించిందో చెబుతూ ఉండేవాణ్ణట. రాత్రిళ్లు 'మీరెవ్వరూ నాపక్కలో పడుకోవద్దు, సరస్వతీదేవి పడుకుంటుంది. పెద్దపక్కేసి నన్ను మాత్రం పడుకోబెట్టు' అని చెప్పేవాణ్ణట. ఈ అంశాలన్నీ నాలో అనుభూతిరూపంలో ఇప్పటికీ నిలిచి ఉన్నాయి.

ఒకనాడు కలలో సరస్వతీదేవి నన్ను వాళ్ళయింటికి తీసుకువెళ్ళింది. ఆ ఇంట్లో ఆవిడఫోటోనే ఉంది. అక్కడున్న కొబ్బరికాయని నన్ను కొట్టమంది. ఆ తర్వాత 'ఏదీ నీ నోరు తెరు' అంది. నేను నోరు తెరిచాను.

'ఆఁ...నీనోట్లో ఆలోపల నేనుండిపోతాను. నీనుండి నేనే మాట్లాడతానులే' అని చెప్పింది. నాకు మెలకువవచ్చింది.

'అమ్మా, ఇలారా, ఇలారా' అని పెద్దగా పిలిచాను. మాఅమ్మ 'ఏమిట్రా ?' అంటూ ఆశ్చర్యపోతూ వచ్చింది.

నేను నోరు తెరిచి 'ఇలా చూడు, ఆలోపల ఏం కనపడుతోంది నీకు ?' అని అడిగాను.

మా అమ్మగారు 'ఏంజరిగింది నాన్నా ?' అని ఆతుర తతో అడిగింది.

నిద్రలో జరిగిన సంగతి చెప్పాను. 'అక్కడ ఉంటూనంది. నీకు కనబడుతోందా ?' అనడిగాను.

ఆవిడ నాకథ అర్థంచేసుకొని, 'అవునునాన్నా ! కన బడుతోంది' అని చెప్పింది. 'ఆవిడ నిన్ను అనుగ్రహించింది' అని మురిసిపోయింది.

అది అంతచిన్నతనమైనా ఆరోజున నేనుపొందిన అను భవమూ, అనుభూతీ ఇప్పటికీ స్పష్టంగా గుర్తుండిపోయాయి.

'అమ్మా ! ఈమధ్య సరస్వతీదేవి నాకు కనబడ్డం లేదే మిటి?' అని అడిగానట ఒకనాడు బాధతో.

'ఈమధ్య నువ్వు కొంచెం అబద్ధాలాడుతున్నావుగదా! అందుకే కనబడటంలేదు.'

'ఆడటం మానేస్తే మళ్ళీకనబడుతుందా ?' అన్నానట ఏడుస్తూ.

'ఇదివరకు కనబళ్ళా ? అలాగే కనబడుతుంది' అన్న ఆవిడ ఓదార్పుతో మళ్ళీ దారినపడ్డానట.

కొన్నాళ్ళకి జంపన-మా రెండవపెద్దమ్మగారింటికి వాళ్ళ మ్మాయి పెళ్ళికి వెళ్లాము. అక్కడికి మా పెద్దపెద్దమ్మగారు వచ్చారు. వాళ్ళది మందపాకల. ఆ రెండురోజుల్లో స్నాన

పానాలు మొదలైనవన్నీ నాకు ఆవిడే చూసింది. పెళ్ళి పూర్తయిపోయి అందరూ బయల్దేరుతుంటే ఆవిడ మాఅమ్మతో 'హైమా! నేను వీణ్ణి తీసుకువెడతాను. పిల్లలందరూ పెద్ద వాళ్ళయిపోయాక ఇల్లు బోసిపోతోంది. వీడు నాదగ్గరుంటే నువ్వేం బెంగపెట్టుకోవు గదా!' అన్నది.

మా అమ్మ ఆవిడమాటను కాదనలేకపోయింది. ఎందుకంటే ఆవిడ మాఅమ్మను తల్లికన్నా ఎక్కువగా చూసుకొంది.

చిత్రంగా నేను మందపాకల చేరుకొన్నాను.

మందపాకలలో నన్ను డైరెక్టుగా మూడవతరగతిలో చేర్పించారు. అది క్రైస్తవులబడి. అక్కడి ఉపాధ్యాయులు మంచివాళ్ళయినా అంటరానిజాతి వాళ్ళన్న భావంతో ఇంటికి రాంగానే మా పెద్దమ్మావాళ్ళు నన్ను బట్టలు విప్పించి, స్నానం చేయించికాని లోపలకు తీసుకువచ్చేవారుకారు.

'ఆ టీచర్లు మంచివాళ్ళని మీకూ తెలుసునుగదా, వాళ్లూ మిమ్మల్ని ఎంతో గౌరవిస్తారు, మీరూ వాళ్ళని ఎంతో ప్రేమతో చూస్తారు-మధ్యలో ఈ అంటరానితనమేమిటమ్మా? మనం గేదెలని ముట్టుకొంటున్నాం, దూడలని ముట్టుకొంటున్నాం. అవి విడిచిన మలమూత్రాలు కూడా చేత్తో తాకుతున్నాం. అట్లాంటప్పుడు మనం వాళ్ళను ముట్టుకొంటే తప్పేమిటమ్మా' అని మా పెద్దమ్మనడిగాను ఒకసారి.

అప్పుడు మా పెద్దమ్మ 'నాకూ వాళ్ళంటే ద్వేషంలేదు నాన్నా, కానీ మా పెద్దలూ, మా పెద్దం పెద్దలూ ఏంచేస్తూ వచ్చారో మేమూ అదే చేయడానికి అలవాటుపడ్డాం. మనం ఒక్కళ్ళం మారితే అవుతుందా నాన్నా ? అయినా, మనం ప్రేమిస్తున్నామన్న సంగతి వాళ్ళకి తెలుసు. అందుకే మీ టీచర్లంతా మనమంటే ఎంతో గౌరవంగా ఉంటారు' అని చెప్పింది.

'ఏమైనా అలవాట్లు మంచివికాకపోతే వదులుకోవాలమ్మా' అన్నాన్నేను.

'మీరు పెద్దవాళ్ళయ్యేటప్పటికి ఆ మార్పు రావచ్చు నాన్నా. మేమిలా అలవాటు పడిపోయాం. మా జీవితాలు ఇలాగే కానీ' అందావిడ.

క్రైస్తవస్వాములవారొకాయన పర్యవేక్షణకు వచ్చి మా క్లాసుకు వచ్చాడు. అతనడిగిన ప్రశ్నలకు జవాబు చెప్పిన తర్వాత 'ఈకుర్రవాణ్ణి ఈ క్లాసులో అట్టిపెట్టారేమిటి ?' అన్నాడు. క్లాసుటీచరు బెదురుగా ముఖంపెట్టాడు. 'ఇతణ్ణి నాలుగో క్లాసులోకి ప్రమోటుచెయ్యండి' అన్నాడాస్వామి. టీచర్ ముఖం ఆనందంతో విప్పారింది.

క్రమంగా నాకు ఒకేవిధమైన ఆలోచన రోజూ రావడం మొదలుపెట్టింది. ఆ ఆలోచనతో నాబుర్ర వేడెక్కుతూ ఉండేది. దాన్ని ఆలోచన అనడంకన్నా ప్రశ్న అనడం

మంచిది. ఇంట్లో ఉన్నవాళ్లుగానీ, చుట్టుప్రక్కల కనబడుతున్నవాళ్లుగాని ఏం చేస్తున్నారా అని చూస్తే రోజూ ప్రొద్దున్నే లేస్తున్నారు; మొహం కడుక్కొంటున్నారు. ఓపికను బట్టి టిఫిను తినో తినకో కాఫీ త్రాగుతున్నారు. వంటలకు ప్రయత్నాలు చేస్తున్నారు. మధ్యాహ్నం భోంచేస్తున్నారు. తర్వాత కొంతసేపు విశ్రాంతి. అంతలో మళ్ళీ టీనో కాఫీనో పెట్టుకొని త్రాగుతున్నారు. తర్వాత సాయంత్రానికి వంట ప్రయత్నం - రాత్రికి భోజనాలు - నిద్రవచ్చేదాకా కాలక్షేపం. తర్వాత నిద్ర. మళ్ళీ నిద్రలేచిందగ్గర్నుంచీ కథ మామూలే గదా! ఒకవేళ వృత్తులూ, వ్యాపారాలూ చేసినా దేనికోసం చేస్తున్నారు ? ఈ తినడం, త్రాగడంకోసమేగా ? ఏం, ఈ తినడం, త్రాగడం లేకపోతే ఏంజరుగుతుంది ? మనం ఉండం. ఉండకపోతే ఏం ? అసలయినా రోజూ ఇలాంటి దినచర్యతోనే సంవత్సరాల తరబడి వీళ్ళంతా ఎలా జీవిస్తున్నారు? ఎందుకు జీవిస్తున్నారు ? వీళ్ళకి విసుగనిపించడంలేదూ ?

ఈ సందేహాన్ని మా పెద్దమ్మముందుంచాను. ఆవిడ ప్రేమతో 'ఇప్పట్నుంచీ నీకలాంటి ప్రశ్నలేమిటిబాబూ ? మాదగ్గరేం సమాధానం లేదు. పెద్దయితే నీకు బోధపడుతుందేమోలే' అంది నవ్వుతూ.

నాకు సంతృప్తికలగలేదు. మా పెద్దనాన్నగారినడిగాను.

'ఒరేయ్, నువ్వు అతిగా ఆలోచించకు. నీ చదువేదో చదువుకో' అన్నారాయన. మా పెద్దమ్మవైపుచూసి 'వీడు చూశావే. ఎలాంటి ప్రశ్నవేస్తున్నాడో నీదత్తుడు' అన్నారు.

వాళ్ళ ప్రేమ నాకు నచ్చింది కానీ నాప్రశ్నకు సమాధానం మాత్రం వచ్చిందికాదు. ఇంకా ఇద్దర్నో, ముగ్గుర్నో ఇదేప్రశ్న వేసినట్టు గుర్తు. వాళ్ళు 'ఓరేయ్, ఏడు పిచ్చివాడవుతున్నాడ్రా, అక్కర్లేని ప్రశ్నలూ వీడూను' అని అనడం నాకు గుర్తుంది. ఆ ప్రశ్నమాత్రం రోజురోజుకూ బలాన్ని పుంజుకొంటూ నామనస్సంతా తానై ఆక్రమిస్తూనే ఉంది.

ఇంతలో మా కుటుంబం కొక్కిలిగడ్డ కొత్తపాలెం నుంచి దివికోడూరుకు చేరుకొంది. మా నాన్నగారు నన్ను కోడూరు తీసుకుపోదామని మందపాకల వచ్చారు. అనుకోకుండా మందపాకలకు చేరినట్టే అనుకోకుండానే మందపాకల నుంచి వెళ్ళిపోవడం కూడా జరిగింది.

కొక్కిలిగడ్డ కొత్తపాలెంలో ఆరంభమైన ఆరాధన మందపాకలలో అన్వేషణగా రూపొంది, కోడూరు విద్యార్థి దశలో తీవ్రరూపం ధరించింది. అంతేకాక మందపాకలలో ఉన్నంతకాలం నాకు తెలిసిందల్లా స్కూలు, నన్ను ప్రేమతో చూసుకొనే మా పెద్దమ్మగారి కుటుంబం. కోడూరు ప్రవేశించడంతో సాంఘికమైన పరిచయం పెరిగింది. ప్రజల జీవితాల్లో అడుగడుగునా ప్రదర్శింపబడుతున్న కక్షలూ, కార్పణ్యాలూ, కుట్రలూ, కుతంత్రాలూ, దగాలూ, మోసాలూ, అక్రమాలూ, అన్యాయాలూ, అంతస్థుల అగాధాలూ, అవినీతి పోకడలూ నా కళ్ళ పడటం ప్రారంభించాయి.

అసలే ఈ జీవితానికి అర్థంలేదని నేననుకొంటుంటే, అర్థం కనిపించని ఈ మూన్నాళ్ళముచ్చటకు ఇన్ని రకాల పోకడలా ? ప్రవర్తనల్లో ఇంతటి వైపరీత్యాలా ? ఏం, ఈ అడ్డదార్లు త్రొక్కకుండా బ్రతకలేరా ? తోడివాళ్ళను హింసించడమో, మోసగించడమో చేయకుండా జీవించలేరా?

సన్నిహితంగా ఉన్న కొద్దిమందిని అడిగి చూశాను -

"సూటిగా ప్రవర్తిస్తే జీవితం సాగదా ? తెలిసికూడా అక్రమంగా ఎందుకు ప్రవర్తిస్తున్నారు ? మీ ప్రవర్తన మీకు అసహ్యం వెయ్యడం లేదా ?" అని.

అందులో ఒకతను అన్నాడు గదా, "బాబూ ! చిన్నప్పుడు మేము కూడా నీలాగే అనుకున్నవాళ్ళమే. నీకేం- మీ అమ్మ వండిపెడుతోంది, మీ నాన్న సంపాదిస్తున్నారు. మరి చెప్పమంటే ఎందుకు చెప్పవ్ ? ఇప్పుడుకాదు, నీకు పెళ్ళయి, పిల్లలు పుట్టిన తర్వాత కూడా నీవిలాగే ఉండి ఇలాంటిమాటలే చెప్పగలిగితే అప్పుడు చూద్దాం" అని.

నేనన్నాను, "నేనెప్పుడూ ఇలాగే ఉంటాను. పెళ్ళయితే మారిపోవాలని ఉందా ?" అని.

దానికతనన్నాడు గదా-"బరువులూ బాధ్యతలూ మీద పడేదాకానే ఎవరైనా ఆశయాలు గీశయాలు అనేది. అవి మీదపడగానే వాటిని తట్టుకొనే మార్గం ఆలోచిస్తాడు తప్ప

తన మాటలు నిలబెట్టుకోవాలనే పిచ్చిని పడడు. ఆ తట్టుకోడానికి ప్రయత్నించడంలోనే మీరు చూస్తున్నవన్నీ ఉంటున్నాయి."

"మీ సమాధానం సంపూర్ణం కాదు. బరువులూ బాధ్యతలూ తట్టుకోడానికి శ్రమ మరింత ఎక్కువగా పడ వచ్చుగా, అక్రమమార్గాలెందుకు ?"

అతడన్నాడు - "అడ్డదార్లుండగా నిలువుదార్ల వైపు ఎంతమంది వెడతారండీ ? ఇదుగో పంతులుగారూ ! మీ వయస్సే మీకు దీనికి జవాబు చెబుతుందండీ నేను కాదు."

ఇప్పుడు నాకు రెండు ప్రశ్నలయ్యాయి. ఒకటి- అసలు జీవించడం ఎందుకు ? అని. రెండు - ఆ జీవించడంలో ఇన్ని అపశ్రుతులు ఎందుకు ? అని.

జీవించడం ఎందుకు అన్న దానికి నాకు నేనే ఆలో చించి ఆలోచించి అప్పటికి ఒక సమాధానం చెప్పుకున్నాను. ప్రతిసంవత్సరం చక్కగా చదువుకొంటున్న విద్యార్థి పై తరగతిలో చేరుతున్నట్టే మనిషి తన ప్రవర్తనలో పవిత్రతను పెంచుకొంటున్నకొద్దీ జన్మజన్మకూ పై తరగతిలో ప్రవేశిస్తూ ఉంటాడు అని. పరిణామక్రమంలో అనేకదశలు దాటి నర జన్మమెత్తిన జీవికి ప్రతిజన్మా తాను పెరిగేందుకు ఒకమంచి అవకాశం- అన్న సమాధానం మాత్రం నా అంతరంగమథనం నుంచి నాకు లభించింది. ఇది కొంచెం బాగానే ఉందను

కొన్నాను. ఎందుకంటే ఈ సమాధానం మనిషిని పవిత్రంగా ఉంచే ప్రయత్నం చేస్తుందికదా !

ఇక రెండవప్రశ్న - ఇంతోటి జీవితంలో ఇన్ని అప మార్గాలు త్రొక్కడం ఎందుకు ? అని. దీన్ని గురించి రోజు రోజుకూ నా మనస్సు పడుతున్న కలవరపాటు పెరగడం ప్రారంభించింది. కారణం సాంఘిక పరిస్థితులయెడల నా పరి శీలన పెరుగుతూ ఉండటమే. క్రమంగా నా ఆలోచనలకు కొంత ఆవేశం కూడా తోడుకావడం మొదలైంది.

ఏదో చేయాలి - ప్రజలకి తాము చేస్తున్న తప్పులు తెలియజెప్పాలి - అందరినీ పద్ధతిలో ఉంచాలి. ఉంచడం ఎలాగ-? ఇదీ నా తపన.

ఫోర్తుఫారమ్‌లోకి వచ్చేసరికి నా జీవితంలో ఒక ప్రాణ స్నేహితుడు ప్రవేశించాడు. అతని పేరు శ్రీధర్. జీవితంలో ఒడుదుడుకులు ఎరిగినవాడు. మేనమామగారివగ్గర ఉండి చదువుకొంటున్నాడు. అతని ఆలోచన్లకు, నా ఆలోచన్లకు పోలికలు ఉండడంతో ఇద్దరం దగ్గరయ్యాం. ఎంతగా దగ్గరయ్యామంటే ఒకరినొకరు విడిచి ఉండలేనంత, రోజూ ఊరికి దూరంగా పోయి, ఒక గట్టుమీద కూర్చుని రకరకాల ఆలోచనలు చేసేవాళ్ళం. సామాజిక పరిస్థితులు సర్దుబాటు కావడానికి మార్గాలేమిటా అని అన్వేషిస్తూ ఉండేవాళ్ళం. ఏదిఏమైనా అందరిలా సరిపెట్టుకొనే జీవితాలు మాత్రం

మనం గడపొద్దు. గడిపితే సరిదిద్దగల జీవితాలు గడపాలి' అని నిర్ణయించుకొన్నవాళ్ళం.

ఈలోపున ఒకసారి క్లాసులో మా సోషల్ మాస్టరు గారు వార్తాపత్రికల గురించి చెబుతూ "విద్యార్థులకు ఉత్సాహం ఉంటే వ్రాతపత్రికలు నిర్వహించుకోవచ్చు' అని సూచించారు. మాకామాట నచ్చింది. పత్రికలద్వారా కొంత చైతన్యాన్ని సాధించవచ్చుననిపించింది. వ్రాతపత్రిక లేమిటి, అచ్చుపత్రికలే నడుపుదామనిపించింది. వెంటనే 'గ్రామ జీవితం'అన్న పేరుతో పత్రికకు మొదటి ప్రతి నేను చెబితే మా శ్రీధర్ వ్రాశాడు. శీర్షికల నిర్ణయంలోను, నిర్వహణలోను ప్రయోగాలు చేశాం. గ్రామీణవాతావరణంలోని కాలుష్యా లను ఈ పత్రికద్వారా కడిగెయ్యాలనుకొన్నాం. ప్రింటింగు కని ప్రెస్‌కు పంపితే ప్రెస్‌వాళ్ళు కలెక్టరుగారి పర్మిషను కావాలన్నారు. మళ్లీ యిదొక ఆలశ్యమా అని, పర్మిషన్ తర్వాత తెస్తాంలే అని చెప్పి మరో ప్రెస్‌లో ప్రింటు చేయిం చేశాం. హఠాత్తుగా హైస్కూల్లో ఆవిష్కరణ సభ. మా అధ్యాపకులంతా నివ్వెరపడ్డారు - కుర్రాళ్ళేమిటి, ఇంత హడావుడేమిటి ? అని. హెడ్మాష్టరుగారు, సోషల్ మాస్టరు గారైన పింగళి ఆంజనేయులుగారు 'ఈ ఇద్దరు కుర్రవాళ్ళు ఎంతో ముందుకు వస్తా'రని ఆనందాతిరేకంతో ఆశీర్వ దించారు. కలెక్టరుగారి పర్మిషన్‌కోసం కాగితాలు వెళ్ళాయి. ఇంతలో శ్రీధర్ నాకు దూరమయ్యాడు. వాళ్ళ మామయ్య

గారికి మరో ఊరు ట్రాన్స్‌ఫర్ వచ్చింది. పత్రిక బారసాల తోనే ఆగిపోయింది. మా స్నేహానికి గుర్తుగా మిగిలిపోయింది.

పత్రిక నడవడం, నడవకపోవడం అనేదలా ఉంచితే దానికోసం మేంచేసిన ప్రయత్నంలో మేమెంతో మానసికంగా పెరిగామని చెప్పొచ్చు.

ఆవేశపూర్వకమైన నా ఆలోచనలు విజృంభించే మార్గాలకోరకు అన్వేషిస్తున్నాయి.

హైస్కూలు జీవితం పూర్తయి కాలేజీలో అడుగు పెట్టడంతో జీవితం మరోమలుపు తిరిగింది. డాక్టర్నయితే కనీసం వ్యక్తిగతంగానైనా లోకానికి సేవ చేయగలననిపించి పి. యు. సి. లో బై. పి. గ్రూపు తీసుకున్నాను. అందులో వారానికి రెండుసార్లయినా కప్పలనో, బొద్దింకలనో, వాన పాములనో కోయవలసివచ్చేది. దానికి నా మనస్సు ఇష్ట పడేదికాదు. ఈ రోజు డిసెక్షన్ ఉంది అంటే మనస్సు చాలా డిస్టర్బన్స్ ఫీలయ్యేది. ఎవరయినా చెట్టుకొమ్మకొడితే నా చెయ్యి నరుకుతున్నట్టుండేది. అలాంటిది నేనే స్వయంగా కోయవలసివచ్చేటప్పటికి భరించలేకపోయేవాడిని వీటిని వేటినీ కోయకుండా నేను డాక్టర్ని కావడానికి వీలులేదా ? అని వాపోయేవాణ్ణి.

పి. యు. సి. అయిందనిపించి బి. ఏ. లిటరేచర్‌లో ప్రవేశించబడిపోయాను.

శ్రీధర్ తరువాత నాకు బాగా సన్నిహితమై నా ప్రాణంలో ప్రాణంగా నిలిచినవాడు రామప్రసాద్. అతను నాకు ఆప్తమిత్రునిగానే కాక అంగరక్షకునిగా కూడా పని చేసేవాడు. ఒకటో తరగతినుండి ఎమ్మేవరకూ నాకతను సహాధ్యాయి. బి. ఏ. చదువుతూ ఉండగా నేను సామాజిక పరిస్థితుల అవగాహన కొరకు పరిశీలనలు జరుపుతూ ఉండే వాణ్ణి ఆస్థితిలో నాచదువు కుంటుపడకుండా నన్ను వెతుక్కొచ్చి, కూర్చోబెట్టి, పోరి చదివించేవాడు రామప్రసాద్. అన్ని ఆలోచనల్తో ఉన్న నేను బి. ఏ. పాసయ్యానంటే కారణం అతనే. నోట్సుల దగ్గర్నుంచి వ్రాసిపెట్టి, నోటికొచ్చే వరకూ చదివి వినిపించేవాడు.

ఈరోజుల్లోనే 'ఇది గాంధీ యుగమా? బ్రాందీ యుగమా?' అన్న నా మొదటిగేయం పత్రికలో అచ్చయింది. అక్కడనుంచి నాభావాలు గేయాల వేషాలు వేసుకోవడం మొదలుపెట్టాయి. మిత్రులు గేయాలు చదివి 'నువ్వు ముందు ముందు మంచి కవి వవుతావయ్యా' అని అన్నప్పుడు 'నేను వీటిని చూపించింది. నన్ను మెచ్చుకోమని కాదు, ఈ భావాలు మీజీవితాల్లోని కెక్కడానికి మీరేమైనా అనుమతిస్తారేమోనని' అని నామనస్సులో అనుకొనేవాణ్ణి. మంచి విషయాన్ని పొగడంతో బాధ్యత తీరిపోయిందనుకొనేవారే ఎక్కువ ఈలోకంలో.

బి. ఏ. ఫైనలియర్ పరీక్షలకు ముందు వీడ్కోలు సభలో నేను చేసిన ప్రసంగం అందరినీ ఆకట్టుకొంది.

హైస్కూల్లో ఉన్నప్పుడు కూడా డిబేట్లలోను, జాతీయదినోత్సవాల సందర్భంగాను నేను మాట్లాడుతూ ఉండేవాణ్ణి. ఎప్పుడు మాట్లాడినా కీర్తికోరకుగాక నా ఆర్తిని వ్యక్తపరచడంకోరకే ఆసన్ని వేశాన్ని వినియోగించుకొనేవాణ్ణి. బి. ఏ. వీడ్కోలు సభలో నే చేసిన ప్రసంగం పొయిటిక్ గా వచ్చింది. ఆతర్వాత ఆటోగ్రాఫ్ వ్రాయమంటే మా మాష్టారు రమణారావుగారు "ఆకులందున అణగిమణగి కవితకోకిల కూయవలెనోయ్" అని వ్రాశారు. అణగిమణగి ఉండాలని అప్పటికి అనిపించలేదుగాని, ఆయనంటే ఎనలేని అభిమానం మాత్రం గుండెల్లో నిండిపోయింది. నాకు బి. ఏ. చదవడంలో సంతృప్తి కలగడానికి, తెలుగుమీాద అభిమానం పెరగడానికి ఆయనే కారకులు. ఎం.ఏ విశాఖలో చదవడానికి కూడా ఆయనే ప్రేరకులు.

రమణరావుగారితోపాటు స్మరించుకోవలసిన మరో వ్యక్తి ఉన్నారు. ఆయనే సి. వి. సుబ్బారావుగారు - హైస్కూల్లో మా తెలుగు మాస్టరుగారు. ఆయన పాఠం చెబితే మాకు నోటికి వచ్చేది. తెలుగు మాస్టర్లంటే కొంత తేలిక భావం కలగడం ఎందువల్లనో లోకసహజమైంది. కాని ఈయిద్దరి వ్యక్తులముందు మరెవ్వరు నిలబడాలన్నా జంకుతుండేవారు. సబ్జక్టునుబట్టిగాక వ్యక్తిత్వాన్నిబట్టే, సామర్థ్యాన్నిబట్టే గౌరవం లభిస్తుందని నాకప్పుడు అర్థమైంది.

బి. ఏ. పరీక్షలువ్రాసి యింటికి చేరుకొన్నాను. అప్పటికి నామనస్సు పూర్తిగా అన్వేషణకు అంకితమైంది. కోడూరుల్లో

ఒకపార్కు ఉంది. ఆపార్కులోకి వెళ్ళి కూర్చుంటూ ఉండే వాణ్ణి. ఆవూరివాణ్ణే గనుక నేను తెలియనివారెవరూ లేరు. క్రమంగా, కారణం తెలీదుగాని, కొందరు కుర్రవాళ్లు నాకు చేరువకావడం ప్రారంభించారు. వారూ నేనూ కలిసి సాంఘిక మైన సమస్యలపై కూలంకషంగా చర్చిస్తూ ఉండేవాళ్ళం. వాళ్ళకు నా ఆలోచన, ఆవేశం నచ్చినట్టున్నాయి. రోజూ పార్కులో నాకోసం వేచి ఉంటూండేవారు. ఫర్వాలేదు నన్నర్థం చేసుకోనేవారు, నాలాగే ఆలోచించేవారు, అవసర మైతే నాతో నడిచేవారు కొందరు నాకు దొరుకుతున్నారని పించింది. నాకు తోచిన అంశాలను వారితో చర్చించి, ఖరారు చేస్తూండేవాణ్ణి. క్రమంగా చేరేవాళ్ళ సంఖ్య పెరుగుతూ వస్తోంది. పార్కు-పక్కన ఉండీ విన్నవాళ్ళు, చెట్లచాటున ఉండి విన్నవాళ్ళు తమకు తెలియకుండానే తాము తమ మనస్సులతోపాటు జరిగివచ్చేస్తున్నారు.

ఈ సమయంలోనే పూసపవు రామ్మోహనరావు అనే మిత్రుడికి రేయింబవళ్లు "అగ్నిజ్వాల" అనే నాటకం డిక్టేటు చేశాను. వ్రాస్తున్న నాటకం సాయంత్రం ఎప్పటికప్పుడు చదివి వినిపిస్తూండేవాణ్ణి. విన్నవారిలో కొందరు ఉత్సాహంతో ఆనందిస్తే, మరికొందరు ఆనందిస్తూ భయపడ్డారు, ఎక్కడ ప్రభుత్వంవారు నన్ను అరెస్టు చేస్తారో అని. నాటకం వెయ్య డానికి అది బేన్ చేస్తారేమోనని మరికొందరు జడిశారు. ఈ సమయంలో నాకు స్ఫూర్తినిచ్చిన కంచెర్లపల్లి శ్రీరామ మూర్తిగారిని నేను స్మరించుకోవాలి.

ఇలా మహాప్రస్థానం కథ ఒక ఉద్యమరూపాన్ని పొందే స్థితికి వస్తూఉండగా విశాఖపట్నంనుంచి ఎం. ఏ., తెలుగులో సీటు ఇచ్చినట్టు వర్తమానం వచ్చింది. సన్నిహితులంతా సంతోషంతో సాగనంపారు. 'మీరు చెప్పినట్టు నడుచుకోవడానికి మేమెప్పుడూ సిద్ధమే' అన్నారు.

"ఈ చదువులు మనకు గమ్యంకావు. మన గమ్యం మన ఉద్యమమే. చదువుదారిని చదువు సాగుతూ ఉండగానే మనదారిని మన ముందుకు సాగవలసి ఉంటుంది. మన కర్తవ్యాన్ని నిర్ణయించడంలో మరింత అవగాహనను పెంపొందించుకోవడానికి మాత్రమే నేను విశాఖపట్నం వెడుతున్నాను" అని చెప్పాను.

బిట్టు సూర్యనారాయణ, ఆంజనేయులు, వెంకటనారాయణ, కోటినాగులు, ప్రకాశరావు, కొక్కిరాయిల పాండురంగారావు, పూసపాటి రామ్మోహనరావులు అప్పుడు నన్ను సాగనంపిన సన్నిహితుల్లో కొందరు.

'అన్నివిధాలా అధఃపాతాళంలోనికి పడిపోతున్న సాంఘిక వ్యవస్థను సరిదిద్దడానికి విప్లవం ఒక్కటే మార్గం. మనం నచ్చచెబితే ఎవరువింటారు ? నిజానికి ఈ వ్యవస్థను చెదిరిపోకుండా, చెడిపోకుండా కాపాడవలసిన బాధ్యత పాలకులది. వాళ్ళే అవినీతి మార్గాల ననుసరించి పాలకులైనప్పుడు వాళ్ళింక అవినీతినేం అణచగలరు ? కాబట్టి యువతరం కర్తవ్యం

విప్లవమార్గాన పయనించడం ఒక్కటే. అయితే విప్లవమంటే అదెలా ఉండాలి ? ఎలాఉంటే మనమాశించిన గమ్యానికి చేరుకోగలం ? - ఇదే ఎం. ఏ., పూర్తయ్యేలోపల నేను గ్రహించుకోవలసింది' అనుకొంటూ విశాఖవైపు ప్రయాణాన్ని సాగించాను.

ఎం. ఏ.లో చేరిన తొలినాళ్ళలోనే మా సీనియర్ విద్యార్థుల్లో నాతో భావసామ్యం గలవారితో పరిచయం ఏర్పడింది. ఆ పరిచయం వారి ఉద్యమంలో భాగస్వామ్యం స్వీకరించడందాకా వెళ్ళింది. ఆ రోజుల్లోనే మార్క్సిజం, లెనినిజాలకు సంబంధించిన గ్రంథాలన్నీ సేకరించి క్షుణ్ణంగా చదివాను. విభిన్న పార్టీల మానిఫెస్టోలు చదివాను. మరో వైపు విభిన్నమతాలకు సంబంధించిన గ్రంథాలూ చదివాను. గ్రంథాలకు సంబంధించినంతవరకూ అన్నీ బాగానే ఉన్నాయి. కానీ వాటి ననుసరిస్తున్నామని చెప్పుకొంటున్న వారిదగ్గరకు వచ్చేటప్పటికే ఇబ్బంది వస్తోంది. ఏపార్టీ ఆశయాలు చూసినా దేశాభ్యుదయమే గమ్యంగా కనబడుతుంది. ఏమతగ్రంథంలో చూసినా వసుధైకకుటుంబమే లక్ష్యంగా కనిపిస్తుంది. మరి ఈ లక్ష్యాలన్నీ ఆచరణలోనికి వచ్చేటప్పటికి ఏమవు తున్నాయి ? ఆశయాలకు, ఆచరణలకు మధ్య పెద్ద అగాధం కనబడుతోంది. చివరికి సమాజాన్ని గూర్చి శాస్త్రీయంగా విశ్లేషణ జరగడానికి ఉద్దేశించిన మార్క్సిజం, లెనినిజాలకు కూడా ఆగతే పట్టింది. వాటి ననుసరించేవారు బుద్ధిమంతు

లైనపుడు గదా అవి పనికివచ్చేది! మనిషి అవకాశవాది అయినపుడు ఏపార్టీగాని, ఏసిద్ధాంతంగాని, ఏమతంగాని అతన్నేం చేయగలదు? బహుశా ఈ అవకాశవాదుల్ని, ఈ దోపిడీదారుల్ని మార్చడం సాధ్యంకాదని,హతమార్చడమే కర్తవ్యమని భావించేవాళ్ళుకూడా ఈ ఆవేదననుంచే పుట్టుకు వచ్చారనిపించింది.

నేనుకూడా ఆ ఉద్యమాలతో చేతులుకలిపితే...?

నేనుకోరిన సమాజగతమైన మార్పు వచ్చితీరుతుంది అంటే చేతులుకలపడానికి నాకేం అభ్యంతరంలేదు. కానీ వచ్చితీరుతుందన్న విశ్వాసం అంతగా కలగడంలేదు. కాని ఈ మార్గం తప్ప దేశానికి విముక్తిని ప్రసాదించే మార్గం మరొకటి ఏముంది? ఇంతకన్నా గత్యంతరం లేదేమో!

ఇలా నాలా బాధపడేవారందరికీ దగ్గరవుతూ వారితో నేనొక్కటే చెప్పాను- "నేను ఏ ఇజానికీ, ఏ పార్టీకీ చెందినవాణ్ణి కాను. చెందాలని కూడా అనుకోవడంలేదు. నేను చూస్తున్న సామాజిక సమస్యలకు పరిష్కారమార్గాన్ని అన్వేషిస్తున్నవాణ్ణి. ఆ అన్వేషణలో ఎన్నో మజిలీలు దాటాను. మీరు కూడా ఒక మజిలీ. ఎక్కడ నాకు సమాధానం దొరుకుతుందో అక్కడగాని ఈ నాప్రయాణం ఆగదు. ఒకవేళ మిమ్మల్ని విడిచివెళ్ళినా మీరు వేరుగా భావించకూడదు. నా తపన నర్థంచేసుకోవాలి. దానికి మీరంగీకరిస్తే మీతో కలిసి ఉండటానికి నాకెట్టి అభ్యంతరమూలేదు.

నేను మీతో ఉన్నా, మీనుండి ముందుకు సాగినా నావలన మీకే అపకారమూ ఉండదు. నా అన్వేషణకు సహకరిస్తున్న వారు మీరు. నేనెప్పుడూ మీకు కృతజ్ఞుణ్ణి."

దానికి సమాధానంగా వాళ్ళు "బ్రదర్, మేం స్వేచ్ఛను కోరుతున్నవాళ్ళం. స్వేచ్ఛకోసం పోరాడుతున్నవాళ్ళం. మీ స్వేచ్ఛను అరికడతామా ?" అన్నారు.

"అయిత్తే నేటినుండి మనం కలిసి ప్రయాణం చేద్దాం" అన్నాను.

"అంతకంటేనా ? మీలాంటి ఉత్సాహవంతులే ఇప్పుడు అవసరం" అన్నారు వాళ్ళు.

నా ఆవేదననీ నాతో కలిసి తిరుగుతున్నవాళ్ళనూ చూసి నా మిత్రుడు రామప్రసాద్, మరోమిత్రుడు నరసింహ రాజు చాలా బాధపడ్డారు. వాళ్ళిద్దరితోపాటు నా రూంమేట్లు రమణ, ఆదిశేషులు కూడా నా గురించి మథనపడ్డారు. ఎలాగైనా ఆ మార్గంనుంచి నన్ను బయటికి లాగాలని వారు నయానా, భయానా ప్రయత్నించారు. అంటే నేనేదో అయిపోతానని భయపెట్టడందాకా వెళ్ళారు. 'నాగమ్యం చేరేటందుకు నేను చేసే ప్రయత్నంలో నేనేమైపోయినా ఫర్వాలేదు. నాకలాంటి భయంలేదు' అన్నాన్నేను. రామ ప్రసాద్ చనవుతో చదువు గురించి గుర్తుచేసి తిరుగుళ్లు మానమని బెదిరించేవాడు. నరసింహారాజు ఆరోగ్యాన్ని గుర్తు

చేస్తూ బతిమాలేవాడు. ఎవరు ఎన్ని చెప్పినా, వాళ్ళ ప్రేమ, బాధ నాకర్థమైనా నా మనస్సు మాత్రం రాజీపడిందికాదు. వాళ్ళకు తెలుసు నే మొండివాణ్ణని. అందుకే వాళ్ళకి భయం ఏక్షణంలో నేనేమైపోతానో అని. నాయెడల వారికిగల స్నేహ భావానికి చేతులెత్తి నమస్కరిస్తూనే, మరోప్రక్క నాకు పరిచయమైన సాహసికులతో చేతులుకలుపుతూ ఉండేవాణ్ణి. కారణం దప్పిక చెందిన నా మనస్సు ఆ దప్పిక తీరేదాకా ఆగదు.

సాహసికులతో కలుస్తున్నాను అంటే వారిని విశ్వసిస్తున్నానని అర్థంకాదు. వారు అనుసరిస్తున్న ప్రణాళికను పరిశీలిస్తున్నాను. ఆ పరిశీలనలో తృప్తి కలిగితే తప్పక విశ్వసిద్దామని నా అభిప్రాయం. విశ్వసించడమే కాదు తుది శ్వాసవరకు ఆ దొరికిన పరిష్కారానికి అంకితమవుదామన్నది నా లక్ష్యం. కాని వచ్చిన ఇబ్బందల్లా నా మనస్సు సమాధాన పడాలి. అదంత తేలికగా కనిపించడంలేదు. ఎవరూ దానిని మభ్యపెట్టలేరు. మరిపించలేరు. మరోలా నమ్మించలేరు. అది సూటిగా చూస్తుంది. సూటిగా సాగుతుంది. అందుకే నా సహచరులను కూడా కొన్ని కొన్ని సందర్భాల్లో నా మనస్సు సూటిగా పరిశీలించేది. అప్పుడప్పుడు నాకు సమాధానం చెప్పడం వాళ్ళకి కష్టమవడం కూడా కద్దు.

"నేను కొన్ని సందేహాలడుగుతాను. మీరేమీ అనుకోరుగదా? మిమ్మల్ని ఎంచడం నా ఉద్దేశ్యం కాదు. ఈ

విషయంలో నాకుగల అనుమానాలను మీముందుంచడమే నాలక్ష్యం. వాటికి మీరు సమాధానం చెబితే అంతకన్నా నాకు కావలిసింది లేదు" అన్నాను నా సహచరులతో ఒకనాడు.

"తప్పక అడగండి. లోతుగా చర్చించినప్పుడేగదా లోటుపాట్లు తెలుస్తాయి! అనుమానాలు తీరకుండా నమ్మడం కన్నా అవి తీర్చుకోవడం చాలా అవసరం" అన్నాడతను.

ఇంక నేను చెప్పడం ప్రారంభించాను.

"చూడండి_అక్రమాలతో సమాజాన్ని దోచుకుంటున్న వాళ్ళ తలలు తీసెయ్యటానికి నేను సిద్ధం. కాని తీసేసింతర్వాత జరిగేదేమిటి ?"

"వాళ్ళు దాచిన ధనం బయటపడుతుంది."

"బయటపడిన తర్వాత ?"

"మనం ఆర్థిక సమానత్వాన్ని సాధిస్తాం."

"అంటే ?"

"అందరికీ సమంగా సంపదల్ని పంచుతాం"

"సరే. ఈ దేశంలో ఉన్న బీదలందరికీ ఏ వెయ్యో రెండువేలో వచ్చాయనుకోండి. వాళ్ళలో ఎక్కువమంది రోజువారీ వచ్చే సంపాదన నేం చేస్తున్నారో మనకు తెలుసు గదా! అలాగే ఈ డబ్బును కూడా నాటుసారాయిగా

మూర్చుకున్నారనుకోండి. కొద్ది నెలల్లో పూర్వంలాగే మిగిలా రనుకోండి. అప్పుడు మనం సాధించిందేమైనట్టు ? కాబట్టి ఆర్థికసామ్యాన్ని సాధించడంతో సమస్యలన్నీ సర్దుబాటవుతా యని మనం భ్రమపడకూడదు. నా దృష్టిలో ఈ దేశంలో డబ్బు ఉంచుకొనే జబ్బు కొందరి దగ్గర ఉంటే, ఉంచుకోలేని జబ్బు మరికొందరి దగ్గరుంది. ఉంచుకొనేవాడు విదల్చడు; ఉంచుకోలేనివాడు మిగల్చడు. ఉంచుకొనేవాళ్లు భోగాలనుభ విస్తుంటే, ఉంచుకోలేనివాడు వ్యసనాలపాలవుతున్నాడు. సరిచేస్తే ఇద్దర్నీ సరిచెయ్యాలి. అందుకే అన్నాను- ఆర్థిక సమానత్వం సాధించడం ఒక్కటే పతనావస్థనుండి తప్పించ లేదని. అంటే ఆర్థిక సమానత్వం ఉండకూడదని నా ఉద్దేశం కాదు. అదొక్కటే చాలదన్నది నా బాధ.

"మరోమాట చెబుతాను. ఈ సమాజంలో కొందరు సామాన్యుల్ని పీడిస్తున్నారని మనం అంటున్నాం. అంటే మన దృష్టిలో పీడించేవారు కొందరు, పీడించబడేవారు కొందరు. కాని నాదృష్టికి అవకాశం ఉన్నంతవరకు పీడించని వాడంటూ ఎవ్వడూ కనబడ్డంలేదు. రిక్షావాణ్ణి మనం శ్రామికుడంటున్నాం. అతనికి న్యాయం జరగాలంటున్నాం. నిజమే, జరగాలి. కాని ఆరిక్షావాళ్ళల్లోనే కొందరు ఏ ఆడ మనిషో, పల్లెటూరిమనిషో ఊళ్ళోకిదిగితే ఏం చేస్తున్నారు? వీలయి నంత ఎక్కువడబ్బు గుంజుకోవాలని చూస్తున్నారా లేదా ? దగ్గరదారిని పోకుండా మలుపులు త్రిప్పి మోసం చేస్తున్నారా

లేదా ? మరి వీళ్ళిప్పుడు పీడిస్తున్నవాళ్ళు కారా ? వీళ్ళ నేమనాలి ? ఉదాహరణకు చెప్పానుగాని నూటికి తొంభై మందికి పైగా అవకాశం దొరికితే చాలు తోడివారిని పీడిస్తూనే ఉన్నారు. తనతో తోడివాడికి పనికలిగిందీ అంటే దాన్ని అవకాశంగా తీసుకొని వాడిమీద స్వారీ చేయాలనే ఈ దేశంలో ఎక్కువమంది ఉబలాటపడతారు. మరి అలా టప్పుడు విశ్లేషణ ఎలా చెయ్యాలి ? ఆలోచించండి.

"ఇంకోమాట చెబుతాను- వింటున్నారు గదా ! ఒక కర్మాగారంలో పనిచేస్తున్నవాణ్ణి మనం కార్మికుడంటున్నాం. అతడి హక్కులు రక్షించడంకోసం మనం బాధ్యత పడు తున్నాం. పడాలని అంటున్నాం. బాగుంది. అది అవసరమే. కానీ ఆకార్మికుడే కర్మాగారం వదిలి, నేరుగా ఇంటికి పోకుండా వచ్చిన కూలిలో మూడువంతులు నాటుసారాకి ఖర్చుపెట్టి, తప్ప తాగి, ఒళ్లు తెలియని స్థితిలో ఇల్లుచేరి, భార్య తనకిష్టమైన కూరవండలేదని కంచాన్ని ఆవిడముఖాన్న విసిరి, ఆవిడ చెబు తున్నది వినిపించుకోకుండా విరగబాత్తున్నాడనుకోండి. అప్పుడు మనమూ, మనయూనియన్లూ ఏం చేయగలుగుతున్నాయి ? ఆలోచించండి. పెట్టుబడిదారు నుంచి కార్మికులకు రక్షణ అవసరం అంటున్నారు. ఆ కార్మికుడినుండి ఆతడి భార్యకి అంతకన్నా రక్షణ అవసరం అంటున్నా న్నేను. ఒక్కమాట చెప్పనా ? తమకు లోకువైనవారిని వేధించుకుతినడంలోనే భారతీయుల్లో ఎక్కువమంది ఆనందిస్తారేమో ననిపిస్తుంది నాకు.

తమపైన ఆధారపడినవారి విషయంలో అలుసు తీసుకోని వారిని ఈ దేశంలో వ్రేళ్ళమీద లెక్కపెట్టవచ్చునేమో ! ఇప్పుడు చెప్పండి ఈ అంశాన్ని మనం ఎట్లా విశ్లేషించాలి ?"

వాళ్ళంతా విస్తుపోయి వింటున్నారు. నేనింకా ఇలా చెప్పాను :

"చూశారా ! తప్పుచేసిన ప్రతివాడితలనీ తరిగేస్తూపోతే తప్పుచేయనివాడంటూ అరుదు కనుక ఈభూమి శ్మశానమవుతుంది. మన నవసామ్రాజ్యం శ్మశానం కావడం మీ కిష్టమేనా ? అప్పుడెవరుంటారు మనం సమానత్వం స్థాపించడానికి? మీరు సూటిగా చూడండి. సిద్ధాంతాల కన్నుల్లోంచి చూడకండి. శిక్షవిధించదల్చుకొంటే తప్పుచేసేవారందరికీ విధించవలసి ఉంటుంది. అలా విధిస్తూపోతే మిగిలేది ఎందరు ? ఇంతమందిని చంపిన తప్పుచేసిన వాళ్ళమవుతాం గనుక మనం కూడా మిగిలే అవకాశం ఉండదు. తప్పు చేసినవాళ్ళు ఉండకూడదన్న మన సిద్ధాంతం ప్రకారమే మనం ఉండకూడదు. ఉంటే అది స్వార్థమే అవుతుంది. మళ్ళీ ప్రాతవ్యవస్థకు మనం వారసులమవుతాం."

వాళ్లు బరువుగా నిట్టూర్చారు.

"మీరు చెప్పినదాంట్లో సత్యం లేదని మేం అనలేం. కాని మీరుకూడా సమస్యల్ని చక్కగా విప్పిచెప్పగలిగారే గానీ పరిష్కారం చూపగలుగుతున్నారా ?"

నేనన్నాను-"ఇప్పటికి సూటిగా చూడటంవల్ల సమస్యల యెడల సదవగాహన ఏర్పడుతున్నట్టుంది. మీకు ముందే చెప్పాను- నేను అన్వేషినని, పరిష్కారంకోసం అన్వేషిస్తున్న వాణ్ణని. ఇది మార్గం కాదని చెప్పగలను గాని ఏదిమార్గం అంటే చెప్పగలిగే స్థితిలో నేనిప్పుడు లేను. మనిషిని చంపడం వల్ల కాకుండా మనిషిని మార్చేమార్గం ఉంటే బాగుండు ననిపిస్తోంది. ఇప్పుడు రావలసింది కేవలం భౌతికమైన మార్పు కాదు. జాతి మొత్తంలో మానసికమైన మార్పు రావాలి. హృదయపరమైన పరివర్తన రావాలి. నైతికపువిలువలయెడల మనిషి కన్నువిప్పి చూడగలగాలి. మనిషికి మరోమనిషితో కలిసి మనడం చేతకావాలి. ఇలాంటి సమగ్రమైన, సంపూర్ణమైన, జాతిపరమైన విప్లవం రావాలి. ఆ వచ్చేవిప్లవం నిర్మాణాత్మకంగా ఉండాలి. అంతవరకూ నేను చెప్పగలను. మీరనవచ్చు 'కృష్ణస్వామిగారూ! మీరు కమ్యూనికల కంటున్నారు. అలా జరగడం అంత తేలిక కాదండీ' అని. నిజమే, తేలిక కాదు. ఊహ తెలిసినప్పటినుంచీ ప్రయత్నిస్తూనే ఉన్నాను. కానీ, ఈజాతిని ఎంతవరకూ మార్చగలిగాను? ఆ మార్చగలిగే మార్గమే అంతుబట్టటంలేదు. ఏదికాదో తెలుస్తోందిగాని ఏది అవునో తెలియరావడంలేదు. అది ఉందా? లేదా? నా అన్వేషణ మీ మజిలీనిదాటి ముందుకు సాగుతోంది. నాకు సెలవిప్పించండి. సమాధానం దొరికితే తిరిగి కలుస్తాను."

"దొరక్కపోతే...?" అన్నాడొక సోదరుడు.

అవును. నిజమే-దొరక్కపోతే...?

దొరక్కపోతే...?

దొరక్కపోతే...?

జవాబురాని ఈ ప్రశ్నతో అక్కడ్నుంచి బయటి ప్రపంచంలో పడ్డాను. రూముకు చేరుకున్నాను.

ఇక నిద్రరావడంలేదు. అన్నం సయించడంలేదు. ఏదీ చేయాలని లేదు. చదువు చదవాలని లేదు. అసలు బ్రతకాలనే అనిపించడం లేదు. పరిష్కారం కనుక్కోలేని జీవితాన్ని గడపడం కన్నా, సమాధానపడలేని జీవితాన్ని నడపడంకన్నా చనిపోవడమే మంచిది, మంచిది అనిపించడం మొదలుపెట్టింది. రోజులు గడుస్తున్నకొద్దీ ఆ భావన బలపడి నిర్ణయంగా మారింది. ఆ నిర్ణయాన్ని అమలుపర్చుకోవడం కోసం ఒక తేదీని నిర్ణయించుకొన్నాను. కావలసిన ఏర్పాట్లు చేసుకున్నాను.

సరిగా ఆ తేదీన మా డిపార్టుమెంటు పిక్నిక్ పడింది. కార్యదర్శి బి. వి. నరసింహరాజు నాకు ఆప్తమిత్రుడుగదా! నేను లేకపోతే తాను పిక్నిక్‌కు వెళ్ళనన్నాడు. "నిర్వహించే వాడే నాతో ఉండిపోతే ఎలాగ? సర్లే! నాకు రావాలని లేకపోయినా నీకోసం వస్తాను" అన్నాను. మనస్సులో 'ఈరోజు నాజీవితంలో చివరిరోజుగదా, మనం నలుగురితో కలిసి నవ్వి

చాలాకాలమైంది. ఈ రోజునైనా నలుగురితో నవ్వడానికి ప్రయత్నించి మానసికంగా వారికి వీడ్కోలు చెప్పి, రాత్రి మనపని పూర్తి చేసుకోవచ్చు' అనుకొంటూ పిక్నిక్ బస్సు ఎక్కాను.

బస్సు మా హాస్టలునుంచి బయల్దేరి నాగార్జునా హాస్టలు ముందు ఆగింది. నిర్వాహకుల్లో ఎవరో 'మీలో కృష్ణమాచార్యగారిల్లు తెలిసినవారెవరు?' అన్నారు పెద్దగా.

వెంటనే అయిదారుగురు 'ఇదిగో ఇతనికి తెలు'సంటూ నన్ను చూపించారు.

నిజానికి అంతకుపూర్వం వారి ఇంటికి వెళ్ళానో లేదో గాని ఆయింటి దారిమాత్రం నాకు గుర్తులేదు. నాతోబాటు మా సీనియర్ మామిడన్న సత్యనారాయణమూర్తిగారిని కూడా దింపారు.

'మీఇద్దరూ కలిసి ఇ. కె. గారింటికి వెళ్ళి, ఆయన్ని పిక్నిక్‌కు బయల్దేరదియ్యండి. మేము లేడీస్‌హాస్టల్ మీదుగా మాస్టరు గారింటికి చేరుకుంటాం. అంతా కలిసి అట్నుంచి వెళ్ళిపోవచ్చు' అన్నారు.

వారిబస్సు బయల్దేరింది.

మేమిద్దరం మిగిలాం.

వీరికైనా ఇంటిదారి తెలియకుండా ఉంటుందా అనుకొంటూ, 'సత్యనారాయణమూర్తిగారూ! మీకు మాస్టరు గారిల్లు తెలుసుగదా!' అన్నాను.

'నాకూ్కడా సరిగ్గా దారి గుర్తులేదండీ' అన్నారాయన.

వెంటనే నేను 'ఆయన జగమెరిగిన బ్రాహ్మణుడుగదా, హోమియో వైద్యం పేరు చెబితే పండుముదుసలి దగ్గర్నుంచి పసికందువరకు ఆయింటికి దారిచెబుతార్లే పదండి' అన్నాను.

ఇద్దరం నడుస్తున్నాం.

అప్పటికి మాస్టరుగారు తీరుబడిలేని వ్యక్తనీ, ఉచితంగా వైద్యసేవ చేస్తూ ఉంటారనీ వింటూఉండేవాణ్ణి. నాకు తెలిసినంతవరకు ఆయన చిత్రమైన గాంభీర్యంతో కనిపించేవారు. క్లాసుకు గూడకట్టుతో వచ్చేవారు. పాఠం చెబుతూఉంటే మాకు ఆకలికూడా తెలిసేది కాదు. వరుసగా రెండుగంటలు వ్యాకరణం చెప్పినా రెండునిమిషాలుగా ఆ కాలం గడిచిపోతుండేది. ఎప్పుడూ ఆయన్ని గురించి ఎవ్వరో ఒకరు వస్తూ ఉండేవారు. డిపార్టుమెంటు స్టాఫ్‌రూంలో ఉండగానే పాదనమస్కారాలు చేస్తూ ఉండేవారు. అప్పట్లో ఈ వైద్యానికీ, యూనివర్సిటీలో ఆయన చేస్తున్న విద్యాబోధకీ, ఆయనకు పెట్టబడుతున్న పాదనమస్కారాలకీ సమన్వయం నాకందలేదు. ఏదో విలక్షణమైన వ్యక్తి, మామూలుగా ఇంటిపట్టున ఉండి చిన్నినాపొట్టకు శ్రీరామరక్ష అనుకొంటూ తినిపడుకొనేవాడు మాత్రం కాదు అనిపిస్తూ ఉండేది.

మొత్తంమీద మాస్టరుగారి ఇంటిని సమీపించాం. మందులివ్వడం ఛివరికి వచ్చినట్లుంది. మాస్టరుగారు నవ్వుతూ,

నవ్వేస్తూ ముందుకు వచ్చినవారిని మందస్మితాలతో పంపిస్తున్నారు. క్లాసురూంలో కూర్చున్నాయనకీ, ఇక్కడ కూర్చున్నాయనకీ ఎంతో వైవిధ్యం గోచరిస్తోంది. క్లాసురూంలో ఆయన అధ్యాపకుడు, అధ్యయనపరుడు. ఇక్కడాయన అందరికీ ఆత్మీయుడు, ఆర్తిహరుడు. కీర్తిని గడించేందుకుగాక ఆర్తిని హరించేందుకే ఆయన అక్కడ ఉన్నట్టు ఆయన ముఖంలో మెరుస్తున్న పవిత్రమైన తేజస్సు చెబుతోంది. వచ్చినపని గుర్తువచ్చి మెల్లిగా సమీపించి,

"మాస్టరుగారూ! ఇవాళ మనకు పిక్నిక్ ప్రోగ్రాం ఉందిగదా, బస్సు వచ్చేస్తోంది. మిమ్మల్ని సిద్ధపరచడానికని మేం ముందుగా వచ్చాం. ఈలోపల మీరు రడీ అయితే..." అంటూ ఉండగానే,

"రెడీ కావడానికేముందోయ్? బస్సురాంగానే ఎక్కడమేగదా కావల్సింది" అన్నారాయన నవ్వుతూ.

'ఎంత ఈజీగా తీసుకున్నారాయన!' అనుకున్నాన్నేను.

ఇంతలో బస్సు వచ్చింది. చివరి పేషెంటుకు మందు వ్రాస్తూ చిరునవ్వుతో బస్సులోనివారివైపు చూస్తూ, రవి శర్మా వస్తున్నావుగదా అంటూ ఆయన బస్సు ఎక్కేశారు.

'ఈయన ప్రవృత్తి చిత్రంగా ఉందే! కనీసం ఇంట్లోకి వెళ్ళి చెప్పయినా రాలేదు. మొత్తంమీద ఈయనా, ఈయన

దినచర్యా మామూలుగామాత్రం లేవు. విచిత్రంగా కనిపిస్తు న్నాయి' అనిపించింది నాకు.

బస్సు భీమునిపట్నం మామిడితోట చేరుకుంది. తోటలో అందరూ స్వేచ్ఛగా విహరించడం మొదలుపెట్టారు. నాకు మాత్రం ఎటూ తిరగబుద్ధి కాలేదు. మౌనంగా కూర్చుండి పోయాను. నాకు సమీపంలోనే మాస్టరుగారు, ప్రొఫెసరు కె.వి. యల్. నరసింహంగారు కూర్చొని ఉన్నారు. మాస్టరు గారు నరసింహంగారితో మాట్లాడుతూ 'ఈమధ్య ఒకచక్కని కావ్యం ప్రారంభమైంది. మీకు వినిపిద్దామని పట్టుకువచ్చాను' అన్నారు.

'అంతకంటేనా ఆచారిగారూ! మీరు దొరకడమే కష్టంగదా, దొరికి, పైగా, కవిత్వం వినిపిస్తానంటే అంతకంటె కావలసిందేముంది? వినిపించండి' అన్నారు ఆనందంగా.

మాస్టరుగారు అప్పుడు రచన సాగుతున్న 'గోదా వైభవ' కావ్యాన్ని వినిపించడం మొదలుపెట్టారు. పద్యాలు అప్రయత్నంగా నాచెవుల్లోకూడా పడుతున్నాయి. ఏదో తెలియని, చెప్పలేని అనుభూతి కలుగుతోంది.

కొంతసేపటికి నరసింహంగారు నావంక చూసి నవ్వుతూ 'నీకెందుకోయ్ ఈ గొడవలన్నీ? వెళ్ళి నలుగురితో కలిసి ఆడుకోక?' అన్నారు.

వారి మాటకు బదులుపలికే స్థితిలోకూడా నేను లేను. మాస్టరుగారు పద్యాలు చదవటం కొనసాగించారు. నాలో కలుగుతున్న చిత్రానుభూతికూడా అలాగే కొనసాగుతూ వస్తోంది.

ఇంతలో టిఫిన్, కాఫీ రెడీ అయ్యాయి. అనుకోకుండా నేను కూడా మాస్టరుగారిప్రక్కను కూర్చొని టిఫిన్ చెయ్యడం జరిగింది. మనస్సు ఏదో తెలిసీ తెలియని లోకంలో విహరిస్తోంది. టిఫిన్ చెయ్యడం పూర్తికాగానే మాస్టరుగారు నా కళ్ళల్లోకి చూస్తూ నాకు తెలిసేలోపలే నేనుతిన్న ఆకునుగూడా కలిపి మడిచి అవతల పారేశారు. ఆసన్నివేశం నన్ను చకితుణ్ణి చేసింది. 'ఏమిటి ఈ ఆత్మీయత ?' ఏమీ బోధపడలేదు. కానీ ఇన్నాళ్ళనుండి సామాజిక స్థితిగతులను గూర్చి ఆలోచించి, ఆలోచించి విసిగి వేసారిపోయిన నామనస్సుకు ఏదో తెలియని స్పర్శ సేదతీరుస్తున్నట్టు అనిపించింది.

ఇంతలో తెలిసినవాళ్ళ కోరికపై మాస్టరుగారు మ్యాజిక్ ప్రదర్శన చేయడానికి అంగీకరించారు. ముందుగా పేకతో ఆయన చేసిన మ్యాజిక్కులు అందరినీ ఎంతగానో ఆశ్చర్యంలో ముంచెత్తాయి. ఆయన మ్యాజిక్కు గురించి కన్నా ఆయన మ్యాజిక్కు కూడా చేస్తారన్న విషయం నన్ను చాలా ఆశ్చర్యపరిచింది. 'ఈయన చేయనిదీ, చేయలేనిదీ ఏమీ లేనట్టుందే !' అనుకొన్నాను. తెలుగు మాస్టరుగారు వైద్యులవ్వడమే ఒక ఆశ్చర్యం.ఆపైన కవిత్వ రచన.ఆపైన ఇప్పుడు

మ్యాజిక్కులు. ఈయన నోటిలో పద్యాలెలా తిరుగుతున్నాయో చేతిలో పేకముక్కలు కూడా అలానే తిరుగుతున్నాయి.

ఇలా ఈయన్ని అబ్జర్వ్ చేస్తూపోతే ఈయన్ని గూర్చి చాలా అంశాలు తెలిసేటట్లు ఉన్నాయే! అనిపించింది. ఇన్నాళ్ళుగా ఈయన పాఠం విని సంతోషిస్తున్నామేగాని ఈయనలో ఇంత కథ ఉందని గ్రహించలేకపోయాం సుమా! అనుకున్నాను. మనస్సు ఆయనను చూడడంలో, ఆయన చేస్తున్నవాటిని గమనించడంలో అంతకుముందెన్నడూ పొందని విశ్రాంతినో ప్రశాంతినో అనుభవించడం మొదలు పెట్టినట్లు ఉంది.

ఇంతలో ఆయన "మీకేమైనా సందేహాలున్నా, అనుమానాలున్నా, ఈ కాగితపు ముక్కలమీద వ్రాసి, మడత పెట్టి ఈ గ్లాసులో పడవేయండి. నేనొక్కొక్కదాన్ని తీస్తూ ఆ మడత విప్పకుండా అందులో ఉన్నది చదివి మీ ప్రశ్నకు తగిన సమాధానం చెబుతాను. ముందుగానే చెబుతున్నాను- ఇదేమీ హిప్నటిజం అనుకోకండి. ఇది కేవలం మ్యాజిక్ మాత్రమే" అన్నారు.

నాక్కూడా ఒక కాగితం అందింది.

"ఏం వ్రాయాలి? వ్రాయడానికేం ఉంది? ఈ రాత్రితో ప్రపంచంనుండి తప్పుకోబోతున్నవాణ్ణి. నాక్కావలసిందంటూ ఏముంది? అయినా ఈయన వ్రాయమంటున్నారు. ఏదో

వ్రాయాలి. ఆవ్రాసేది ఈయన తత్త్వాన్ని గూడా పరీక్షించేదిగా ఉండాలి" అనుకొంటూ "నేను నా జీవితంలో ఏమి సాధించ గలను?" అని వ్రాశాను. దాన్ని మడుస్తూ 'ఇంతవరకూ సాధిం చింది లేదు, ఇకపైన సాధించడానికి నేనుండబోవడంలేదు. ఇప్పుడు ఈయనేం చెబుతారో చూడాలి' అనుకుంటూ గ్లాసులోపడవేశాను.

రవిశర్మను కూర్చోబెట్టి అతని నెత్తిన గ్లాసు పెట్టి, గ్లాసులోనుంచి ఒక్కొక్క కాగితపు మడతను తీస్తూ, దానిని మడత విప్పకుండా అందులో ఉన్నది చదివి సమాధానాలు చెప్తూవుంటూ వస్తున్నారు మాస్టరుగారు.

ప్రశ్నలనుబట్టి కొన్ని సమాధానాలు నవ్విస్తున్నాయి, మరికొన్ని కవ్విస్తున్నాయి. ఇంకొన్ని ప్రశ్న లడిగినవాళ్ళ ఆలోచనలను తల్లక్రిందులు చేస్తున్నాయి. ఎంతకూ నా కాగితం మాత్రం రావడంలేదు. ఇంకా రాదేమిటి ? ఇక్కడకూడా నాకు నిరీక్షణే మిగులుతోందే అనిపించింది.

'అవును, వస్తుంది-వస్తే ఆయనేదో చెబుతారు. చెబితే ఏం జరుగుతుంది ? ఏదయినా జరుగుతుందనా ?......కాదు, కాని మనస్సెందుకో 'ఆయన నా కాగితాన్ని తియ్యాలి, దాని కాయనేం జవాబు చెబుతారో చూడాలి' అని ఒకవిధమైన తపనపడుతోంది. కాగితాలు పూర్తవుతున్నాయి. చివరి

కొక్కటే మిగిలింది. తీసి చదువుతూ "నేను నా జీవితంలో ఏమిసాధించగలను?" - ఎవరిది వ్రాసింది? అని అడిగారు మాస్టరుగారు.

"నేనే" అన్నాను.

"లే" అన్నారు. ఏదో స్పర్శ ఆపాదమస్తకం ముంచెత్తు తోంటే లేచి నుంచున్నాను.

"ఇలా రా" అన్నారు.

ఆ పిలుపులో ఎంత ఆత్మీయత ఉందో అంత ప్రభుత్వమూ కనబడింది. అది ఆజ్ఞారూపమైన ఆహ్వానం. శరీరం తడబడు తూండగా శక్తితరంగాలలో ఈదుతున్నట్టయి ఏదో అను భూతి ననుభవిస్తూ ఆయనకు దగ్గరయ్యాను.

"నీ చెయ్యేదీ?" అన్నారు.

చేతిని చాపాను. తనచేత్తో నాచేతిని పట్టుకొని తన వైపుకు వంచారు. ఒళ్ళంతా కరెంటుషాక్ కొట్టినట్టు జివ్వు మంది. ఒక్కక్షణం పరిశీలనగా చూశారు. మరుక్షణం తల పైకెత్తి నాకళ్ళల్లోకి చూస్తూ-

"నీ ముప్ఫయిరెండోఏట నిన్నొక మాగ్నెట్ మాగ్న టైజ్ చేస్తుంది. ఆపైన నీవు కొన్ని వేలమందికి ఆధ్యాత్మికంగా మార్గదర్శి వవుతావు" అన్నారు.

"అలా జరగడం సాధ్యంకాదు మాస్టారూ" అన్నా న్నేను అప్రయత్నంగానే.

కళ్ళల్లోకి చూస్తూ "చూద్దాంగా" అన్నారు చిరునవ్వుతో.

నాకు సన్నిహితులైన సహాధ్యాయులు ఆయన మాటలు విని ఆశ్చర్యపోయారు. "వీడేమో 'విప్లవం, విప్లవం' అని అంటున్నాడు. ఈయనేమో ఆధ్యాత్మికంగా మార్గదర్శివవుతావని చెబుతున్నారు. ఇదేమిట్రా బాబూ ? ఇప్పటికే వీణ్ణిగురించి అర్థంకాకుండా ఉంటే ఈయనమాటలు వీడి విషయంలో మనకి మరింత కన్ఫ్యూజన్ పెంచుతున్నాయేమిటి ?" అనుకొన్నారు. ఏంజరుగుతుందో, ఎవరిమాట నిజమవుతుందో వేచిచూడాలి అనుకున్నారు మరికొందరు. నేను మాత్రం అదోరకమైన నిశ్శబ్దస్థితిని కొంతసేపటివరకు అనుభవించాను.

ఇంతలో అందరూ భోజనాలకి కాళ్లుకడుగుతున్నారు. అక్కడ మాస్టరుగారు మళ్ళీ దగ్గరయ్యారు. నేనాయనవంక చూశాను. ఆయన నావంక చూశారు. కాసేపు ఆయనతప్ప పరిసరాలు కనిపించలేదు. భోజనాలు పూర్తయినాయి. భోంచేస్తున్నంతసేపూ నాకళ్ళు ఆయనవైపే చూస్తున్నాయి.

తరువాత చేతులు కడుక్కొని ఒక చెట్టుక్రింద నిలబడ్డాను. ఇంతలో ఏదో కలకలంలా వినిపించింది. అటువైపు చూశాను. మేం తిన్న ఎంగిలాకుల గుట్ట దగ్గర ఇద్దరు ముగ్గురు చింపిరి బట్టల పిల్లలు పోటీపడుతున్నారు. మనస్సు చివుక్కుమంది,

ఈ దేశంలో ఈ దృశ్యాలు ఎప్పటికి కనిపించకుండా పోతాయి ? తట్టుకోలేక కొంచెం దూరంలో మరో చెట్టు దగ్గరకు వెళ్ళి కూర్చుండిపోయాను. ఏవేవో సన్నివేశాలు కళ్ళ ముందు రీలు తిరిగినట్టు తిరుగుతున్నాయి. ఏ యే సన్నివేశా లను చూసి నా మనస్సు చిన్నప్పటినుంచి గాయపడుతూ వచ్చిందో ఆయా సన్నివేశాలన్నీ వరుసగా కళ్ళముందు బొమ్మకట్టినట్టు సాక్షాత్కరించడం మొదలుపెట్టాయి.మనస్సు, తనువు, విలవిలలాడిపోతున్నాయి. కళ్ళ వెంట ధారలా కన్నీళ్ళు కారుతున్నాయి.

ఇంతలో ఎవరో వీపుతట్టారు. చూస్తే సత్యనారాయణ మూర్తిగారు- నేను విప్లవభావాలతో తిరుగుతున్నానని,సున్నిత మైన నామనస్సు స్పందించి, విజృంభించి, ఏక్షణంలో ఏమై పోతానో అని నాగురించి బాధపడే నామిత్రుడు నరసింహారాజు సత్యనారాయణమూర్తిగారికి నా విషయమంతా చెప్పి, 'ఎలాగైనా మీరు మా కృష్ణను రక్షించాలి' అని కోరాడుట. అప్పటినుంచి సత్యనారాయణమూర్తిగారు నాకు తెలియ కుండానే నాకు సన్నిహితులయ్యారు. నాతో ఎక్కువ కాలం గడుపుతూ, నా భావాలలో పాలుపంచుకొంటూ ఉండేవారు. క్రమంగా మా సాన్నిహిత్యం ఆత్మీయతగా రూపొందింది. ఆయన ఇప్పుడు ఈస్థితిలో నన్ను ఓదార్చడానికి ప్రయ త్నిస్తున్నారు.

నేనన్నాను- "సత్యనారాయణమూర్తిగారూ! మీరు ఓదారుస్తున్నట్టు నాకు తెలిసిపోతోంది. నా సమస్యలకు పరి

ప్ప్రాకారం కనుచూపుమేరలో కనబడటంలేదు. నా మనస్సు సమాధానపడటం అంత తేలిక కాదండీ."

నామాటలు విని, "అన్నీ తెలిసిన మిమ్మల్ని ఓదార్చట మెలా సాధ్యం ? కానీ మీరు నిలద్రొక్కుకోవాలి. నామాట వినండి. లేవండి. కొంచెం నలువైపులా తిరుగుదాం. మనస్సు కొంత సర్దుకొంటుంది" అంటూ చేయిపట్టుకు లేవదీశారు.

అయిష్టంగానే, రాత్రివరకూ కాలంగడపకతప్పదు గదా అని లేచి ఆయనతో కలిసి సహాధ్యాయులు గుంపులు గుంపులుగా రకరకాల ఆటలు ఆడుతుంటే ఎక్కడైనా కాస్సేపు నిలబడటానికి సాధ్యమవుతుందేమోనని చూశాను. ఏ బృందం దగ్గరా నిలబడబుద్ధికాలేదు. అలా బృందాలు దాటుతూరాగా, ఒకచోట మాస్టరుగారు పదిమందితో కూర్చొని సంభాషణలు జరుపుతున్నారు. అప్రయత్నంగా మేముకూడా అక్కడ కూర్చొబడ్డాం.

అక్కడ చేరినవాళ్ళంతా ఇన్నాళ్ళికి మాస్టరుగారు ఖాళీగా దొరికారుగదాని వాళ్ళకు ఉన్న, వాళ్ళు విన్న సందేహాలను బయటపెట్టి మాస్టరుగారి నుంచి సమాధానాలు రాబడుతున్నారు. ఒక్క పది నిముషాలు గడిచింది. ఏం జరుగుతోందో గమనించి ఆశ్చర్యపడ్డాను. మాస్టరుగారితో కలిసి నేనుకూడా తోడివారి ప్రశ్నలకు జవాబులు చెబుతున్నాను. మాస్టరుగార్కు చెప్పిందాన్ని ఉదాహరణలతో వివ

రించడమో, మాస్టరుగారు చెప్పబోయేముందే నేను చెప్పేస్తే మాస్టరుగారు 'కరెక్టు. అంతేనోయ్' అనడమో జరుగుతోంది.

'ఏమిటిది, విచిత్రంగా ఉందే ? ప్రశ్నలను మాత్రమే ప్రోగుచేసుకొంటూవచ్చిన నేనా ఇప్పుడు సమాధానాలు చెప్పడంలో పాలుపంచుకొంటున్నాను ? అదికూడా ఈప్రశ్నా, ఆ ప్రశ్నా అని నిమిత్తం లేకుండా నేనెరిగిన, నేనెరుగని అన్ని ప్రశ్నలకూ ఈ జవాబులు ఎక్కడ్నుంచి వస్తున్నాయి? పైగా నేను చెబుతున్నవాటిని మాస్టరుగారితో పాటుగా స్వీకరిస్తున్నారు తప్ప, ఎవ్వరూ క్రొత్తగాగాని, వింతగాగాని ఫీలవుతున్నట్టు లేదు.

ఇంతలో ప్రొద్దువాలుతోంది. అందరం బస్సెక్కాం. బస్సు భీమునిపట్నం బీచ్ దగ్గర ఆగింది. అందరం దిగాం.

నేను మాస్టరుగారి దగ్గర్లో ఉన్నాను. సముద్రంవైపు చూస్తూ నిలబడ్డారాయన.

మాస్టరుగారి పాదాలపై ఎక్కడినుంచో త్వరత్వరగా వచ్చిన వృద్ధుడొకరు సాష్టాంగపడ్డారు. మాస్టరుగారు 'రమణమూర్తిగారు వచ్చారే' అంటూ ఆయన్ని చూపులతో కుశలమడిగి, కొంచెం దూరానికి దారితీశారు. అక్కడ కూర్చుని "మిమ్మల్నిప్పుడు వదలిపెట్టను. మీకు నే వ్రాస్తున్న క్రొత్త కావ్యాన్ని వినిపించి తీర్తాను" అన్నారు నవ్వుతూ.

"అంతకంటేనా, మహాభాగ్యం!" అంటూ ఆయన చెవులు పెద్దవిచేసుకున్నారు.

మాస్టరుగారు మళ్ళీ "గోదావైభవం" మొదట్నుంచీ వినిపించడం మొదలుపెట్టారు. ఆయన పరవశిస్తున్నారు. ఆయనతోపాటు నాకు తెలియకుండానే దగ్గరై నేనూ వింటున్నాను. కాస్సేపటికి మరో విచిత్రం గమనించాను. మాస్టరుగారు పద్యాలు చదువుతుంటే ఆ పద్యాలలోని అంశాలను గురించీ, వైభవాన్ని గురించీ నేను వివరిస్తున్నాను. రమణమూర్తిగారు ఆశ్చర్యపడుతూ మాస్టరుగారి ధారకు నేను అడ్డువస్తున్నాననుకోకుండా ఆనందంతో వింటున్నారు. మాస్టరుగారు ప్రతిసారీ 'బాగుంది, చాల బాగుంది' అంటూ వీపుతడుతూ అభినందిస్తున్నారు.

చీకటి పడబోతోంది. రమణమూర్తిగారు మాస్టరుగారికి వీడ్కోలు చెప్పారు. అందరం బస్సెక్కాం. బస్సు విశాఖ పట్నంవైపు తన ముఖాన్ని త్రిప్పింది.

బస్సులో తనప్రక్కన కూర్చోమంటూ వెనకనుంచి ఒక మిత్రుడు పిలిచాడు. ఒక్కక్షణం కూర్చున్నాను. ఇక కూర్చోబుద్ధి కాలేదు. నాకు తెలియకుండానే లేచినిలబడి ముందుకు నడిచాను. మాస్టరుగారు కూర్చొన్న సీటుప్రక్కనే సపోర్టింగ్ రాడ్ పట్టుకొని నిలబడ్డాను. ఆయనవైపు చూడాలనిపించింది. చూశాను. ఆయనకూడా నీవు చూస్తున్నట్టు

గ్రహించాను అన్నట్టు తలపై కెత్తి నాకళ్ళలోకి చూస్తూ సేద తీర్చగల చిరునవ్వు నవ్వారు.

చెప్పనలవికాని ప్రశాంతిని అనుభవిస్తోంది మనస్సు.

అది బస్సనీ, అందులో మిగతావాళ్ళు కూడా ఉన్నారనీ మనస్సు మర్చిపోయింది. ఆయన్ని మాత్రమే చూస్తూ, ఆలోచనలకు కూడా అవకాశంలేని పరవశత్వంలో ఉండిపోయింది. కనురెప్పలు తమకర్తవ్యాన్ని మర్చిపోయాయి. ఫలితం ఆయన్ని చూసేకాలంలో అవికూడా అడ్డురాలేదు.

బస్సు విశాఖపట్నం సమీపిస్తోంది.

మాస్టరుగారు నావంక చూస్తూనే ఉన్నారు. ఆ చూపులు సేదతీరుస్తున్నాయి, ఓదార్పునిస్తున్నాయి. నీకు నేనున్నానంటూ అభయాన్ని ప్రకటిస్తున్నాయి. నీవు నావాడివంటూ ఆత్మీయతని వర్షిస్తున్నాయి. ఏదో అవ్యాజమైన ప్రేమ ! అన్నిటికన్నా అతీతమైన అనురాగం ! అవధులెరుగని కరుణ ! ఆ చూపుల కిరణాల ద్వారా వ్యక్తమవుతూ నాలోని అణువణువునూ స్పృశించి తన్మయుణ్ణి చేస్తున్నాయి. మనస్సు, శరీరం తేలికై తేలిపోతున్నట్టనిపించింది. స్నానం చేసిన తర్వాతలాంటి తాజాతనాన్ని శరీరంతోపాటు నాలోని అన్ని కోశాలూ అనుభవిస్తున్నాయి.

ఇక బస్సు విశాఖ పొలిమేరలో ప్రవేశించబోతోంది. మాస్టరుగారు 'ఇక్కడ బస్సాపవోయ్' అన్నారు డ్రైవరుని.

